# శ్రీ మహాభారతము: వచనము

## మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి ప్రణీతము

### 18 పర్వములు - 16 సంపుటములు

| | | | | |
|---|---|---|---|---|
| ఆదిపర్వము | | 4 | 0 | 0 |
| సభాపర్వము | | 1 | 0 | 0 |
| అరణ్యపర్వము | 1 వ భా॥ | 3 | 0 | 0 |
| డిటో | 2 వ భా॥ | 3 | 0 | |
| విరాటపర్వము | | 2 | 8 | |
| ఉద్యోగపర్వము | | 3 | 0 | 0 |
| భీష్మపర్వము | | 3 | 0 | 0 |
| ద్రోణపర్వము | | 3 | 0 | 0 |
| కర్ణపర్వము | | 2 | 0 | 0 |
| శల్యపర్వము | | 1 | 8 | |
| సౌప్తికపర్వము | | 0 | 12 | |
| స్త్రీపర్వము | | 0 | 8 | |
| శాంతిపర్వము | | 4 | 8 | 0 |
| అనుశాసనిక పర్వము | | 3 | 0 | 0 |
| అశ్వమేధపర్వము | | 1 | 8 | 0 |
| ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | | 1 | 4 | 0 |

పూర్తి సెట్టు వెల 37—8—0

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి

# మౌలానా అజాద్

## జీవితచరిత్ర

గ్రంథసంధాత:

మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రి



పబ్లిషర్సు

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1955

 [ వెల రు 0—8—0 ]

రాజమహేంద్రవరమున

శ్రీ కొండపల్లి ముద్రాశాలయందు

ముద్రింపఁబడియె.

# తొలిపలుకు

"భరత వర్షీయ కార్మిక ప్రౌఢిదలచి
వేడికన్నీరు నింపనివాఁడు గలఁడె?"

భారతదేశము పాలవెల్లివంటిది. ఎన్నిరాజ్యతంత్రంపు టోడలందులో దిరిగి రత్నరాసుల నూడ్చుకొనిపోయినను వట్టిపోవునది కాదని ప్రాక్ప్రతీప్రజా బాహుళ్యముననీయశరీర వార్క్హ, ఇబ్బడిధ్వనులతో మ్రోయుచునే యున్నది. భారతమాత యెంత కనుపుచేలవగల తల్లియో పరమేశుండుదక్క నన్యులెఱుంగజాలరు. పైపై మెఱుంగులనాచుకొనిపోవునాశాపిపాసులామెగర్భమున కడుపుగట్టిన యమృతశిలాల నాచుకొని పోలేకపోవుటటుండ దానిప్రకృతితత్త్వముగూడ నెఱుంగజాలరైరి. వారిరాజ్యపాలనాచతురత, తంత్రవిద్యాప్రావీణ్యములచట గడ్డిపరకకైన కొఱగావు. ఆయమ తన గర్భగోళముననున్న ఖనినుండి యమృతకిరణము నొక్కొక్క దానిగా నప్పటప్పట వెలికిదీ యీవిశాలప్రపంచమున విసరివైచును.

అట్లామాతృమూర్తిచే విఱజిమ్మబడిన యమృతకిరణము పవిత్రభారతక్షేత్రమున దేశరువునో గిరికందరముననో విపినసీమనో విజ్ఞానహృదయముననో బడి తళతళ మెఱయుచుం గాలక్రమంబున జగజ్జేగీయమానంబగును. ఆసుఖామయ కిర

ణముదివ్యసీమయగు నీభారతీయ సస్యకదంబరాశిలో నేమూల కందమునో ఏకంచె ప్రక్కనో, యాడిలో గన్పట్టి తన భవ్య కాంతులను వెదజల్లును. భరతభూమిలోని యార్షక్షేత్రమున నున్న పెద్దమడులలో నత్యంత ప్రమాణము నావరించి యున్నవి రెండు మడులే. ఆమడులలో నెన్నో సస్యాంకురము లుద్భవిల్లి జగత్ప్రతాపుని తాపమున కాగజాలక మలమల మాడిపోవును. అట్లెన్నియో మనము గాంచుచున్నారము.

హిందూ దేశమందలి ప్రఖ్యాతినందిన ప్రాచీన, ఆధునిక జాతులలో అగ్రస్థానమంద దగినజాతులు రెండింటిలోను పేరెన్నికగన్న మహనీయు లున్నారు. అందు హైందవప్రజానీకమందు నాయకమణిగ నేడెన్నుకొనబడువాడు మహాత్మాజీ. అట్లే రెండవజాతియందు మహమ్మదీయులలోగూడ కొందఱ యున్నారు. వారిలో నేటిముస్లిముల రత్నహారమున నాయకమణి శ్రీ మౌలానాఅజాద్ గారు. ఈయన నిర్మలప్రశాంతత, ధార్మికత, వినయశీలత్వము, సాంఘిక మైత్రిజాతీయైక్యములతో కరిగిపోసిన గీటురాయి, నేటిభారతీయప్రజాసేవకులలో వ్రేళ్ళ మీదలెక్కపెట్టదగిన పూజనీయులలో నొకడు త్యాగధనుడు. అట్టిమహనీయుని పవిత్రజీవితమునే యిపుడు పాఠకమహాశయులు చదువబోవుచున్నారు,

ఎందరు సుపుత్రులున్న నేమి! భారతమాత దాస్యశృంఖలములు సడలింపబడువారు లేకపోయిరే యను భారతీయ

ప్రజాబాహుళ్యము తమసోదరుల భౌతికాధ్యాత్మికశక్తులను గనుగొనవలెనన్న యిట్టి పవిత్రచరిత్రములవలననే తెలియం దగునను భావముతో యింతదనుక కొందఱు దేశనాయకాగ్రణుల జీవితములను ముద్రించి యాంధ్రసోదరుల యెదుట బెట్టి యున్నాము. ఇంకను ప్రబలప్రయత్న మొనరించి వెలువరింపనున్నాము కారాగారమునుండియనతికాలముక్రిందట ముక్తుడై కాంగ్రెసుసభాధ్యక్షుడై రాజకీయవేత్తయై శాంతమూర్తియై కార్యశూరుఁడైన శ్రీమౌలానా అజాదుగారి జీవితమును జదివి లేని హిందూమహమ్మదీయ మైత్రి యెంతకాలమునుండి యంగాంగీభావముగ వచ్చుచున్నదో ప్రజానీకము గ్రహించుటయే గాక నా మహనీయుని జీవితమునుండి కొంతతత్వమునుగూడ సేకరింపగలరని విశ్వసించు చున్నాము.

ఇట్లు,

ప్రకటనకర్తలు.

# ఉపక్రమణిక



"చాణక్యనీతి తార్కాణగా జంద్రగుప్తాది
మౌర్యులు దేశ మరయునాఁడు
పరహింసవలని దేవత్వమేని త్యజించి
ఘనుఁ డశోకుఁడు ప్రజన్ మనుపునాఁడు
జాతికవిత్వవిద్యాతత్త్వవర్ధనుం
డిల హర్షవర్ధనుం డేలునాఁడు
కాకతీయాది సత్ క్షాత్రవంశప్రభుల్
నియతి దేశంబు బాలించునాఁడు

కృషియు నానాపరిశ్రమల్ వృద్ధిజెంది
నావికావర్తకము మహోన్నతి వహించి
భవ్యవిభవానుభవమున భరతభూమి
నాగరికకు ప్రథమగణ్యముగ నుండె"

అట్టి విశాలభారత దేశమును నేటిపరిస్థితులలో సింహావలోకనమును జేసితిమేని వేడికన్నీరు జొటజొట గంగాప్రవాహమువలె జాలువారక మానునా? భారతమాత పుత్రులలో నొక్కనిసుగునకే యింతదుఃఖము కాఁగి పొరలిరా యింక నలుబదికోట్ల పుత్రపుత్రికారత్నములం గన్న యీ భారతమాతృమూర్తి కడుపు అంపపుకోత పెట్టదా? పెట్టుగాక.

ఆతల్లి క్షమామూర్తి. శాంత స్వామె నైజము. అందువలననే లెక్కలేనన్ని కడగండ్లను దిగమ్రింగుచు మహాభాగ్యమైనను "పుత్రాదిచ్ఛేత్పరాజయం" అన్నట్లిప్పటికేని తనగర్భశుక్తి ముక్తాఫలమే తన్నుద్ధరించునని యూరట జెందియున్నది.

ఆమెకు జాతిమతభేదములు లేవు. ధనిక పేదభావ మసలే లేదు. సర్వసమాన, మహమ్మదీయుడేగాని హిందువే గాని మఱియొకడే గాని యైనను అతడు తన పుత్రుడైన యాతని నంగీకరించును. ఎందఱో మహమ్మదీయప్రముఖు లున్నారు. ఒకరికి శాంతమున్న తెంపి లేదు. తెంపియున్న మతి యొకటి లేదు. ఇట్టి నేటి మహమ్మదీయుల తెగలో అట్టి శీలాగ్ర గణ్యుని నామ మనంతముగా భారతభూమిని మ్రోగుచున్నది. అతడే మన మహమ్మదీయసోదర నాయకాగ్రణి మౌలానా అబ్దుల్ కలాం అజాద్.

నేటి జాతీయత భరతఖండమంతయు నిండియున్నది. దానిభద్రత యంతయు కాంగ్రెస్సు మహాసభ తనభుజస్కంధ ముల దాల్చినది. ఆ సంస్థను, దాని కార్యకలాపభారమును ఒక మహానీయుని [illegible] పెట్టుకొని ప్రాచీకత్తు నియ [illegible] ఇప్పు డా స్థానమును విదేశీయుండు జన్మించినవాడును, వీరపురుషుడును కార్యశూరుడునగు మౌలానా అజాద్ గారు వహించియున్నారు. నేటికాలమున అర్ధిక సాంఘిక కాము లకును [illegible] మున్నాది. దానిని

నిర్వహించుటకు మహాత్యాగి కావలెను. అట్టి పూజ్యానే కాంగ్రెసుసంస్థ వరించుచుండును.

౧

## జననము

"ఆపదలందు ధైర్యగుణ
మంచితసంపదలందు తాల్మియున్
భూపసభాంతరాళమున
పుష్కలవాక్చతురత్వ మాజి బా
హాబలశక్తియున్ యశము
నందనురక్తియు విద్యయందు వాం
ఛాపరివృద్ధియున్ ప్రకృతి
జన్యగుణంబులు సజ్జనాళికిన్."

మౌలానా అబ్దుల్ కలాం అజాద్ గారి అసలు పేరు అహమ్మదు. ఈయన తండ్రి తాతలు మొదలగువారి జన్మభూమి పవిత్రభారత దేశమే అయినను 1857 సం॥రంలో జరిగిన సిపాయిపిప్లవకాలమున వీరు భారత దేశమునుండి అరేబియాకు పోయిరి. ఈయనతండ్రిగారచట నొక అరబ్బుయువతిని పెండ్లాడెను. ఆయన మహావిద్వాంసుడును, ధార్మికుడు నగుట తెలిసి

కొని యప్పటి ఉర్దూపుత్రుని పిలిపించి, తమ రాజధానిలో నుండవలసినదిగా నేర్పాటు గావించెను. అరబ్బీయువతి గర్భమున మక్కాయందున మహమ్మదీయ పుణ్యక్షేత్రమున 1888 లో అజాద్ జన్మించెను.

ఆయన వంశీయు లందఱును ధర్మశాస్త్రపరిజ్ఞాన వేత్తలు, మహాపాండిత్యసంపన్నులై యుండిరి. వీరివంశమునకు ఆది పురుషుండు షేక్ జమాలుద్దీను అను మహాపండితుడు. ఆయన పాండిత్యప్రతిభను ప్రఖ్యాతి విని యక్బరుచక్రవర్తి యాతనిని పిలిపించి తన యాస్థానమున ప్రధానవిద్వత్పీఠి నలంకరింప జేసెను. తదాది యీవంశీయులు ముస్లిముమతాధికారులుగ నుండిరి. వారప్పుడప్పుడు జన్మభూమియందలి యభిమానముచే అరేబియాదేశమునకు పోయివచ్చుచుండెడివారు. పులి కడుపున పులిపిల్లయే పుట్టునుగాని మేకపిల్ల పుట్టదుగదా! అటులగనే అజాదు అట్టిపవిత్రవంశమున జన్మించుటనుబట్టియే మొదటినుండియు నాయన వంశపారంపర్యముగా వచ్చు శాంతాదిసద్గుణంబుల నలవరచుకొనెను.

ఆయన పితృవాక్యపరిపాలనా దక్షతయందును, మాతృభక్తియందును మిగుల విశ్వాసముంచి బాల్యమునుండియు తన్ను ప్రేమించి పోషించు జననీజనకులయెడ కడుభక్తి వాత్సల్యములను జూపుచు వారిమాట కెన్నడు దాటక మెలగుచుండెడివాడు, ఆయన బాల్యమంతయు అరేబియాదేశము

వనే గడచిపోయెను. అందుచే నా దేశీయాచారములును, సాంప్రదాయములును చక్కగా పట్టుపడెను.

హిందువులు కాశీక్షేత్రము నెట్టి పవిత్రస్థలముగా భావించి వందలాదిమైళ్ళు కాలినడకనుగూడ నడచిపోయి యమ్మహానగరమును, అందు వెలసిన విశ్వేశ్వరుని, అన్నపూర్ణాదేవిని వియద్గంగను సేవించివత్తురో యట్లే మహమ్మదీయులకు మక్కాపట్టణము ముఖ్యక్షేత్రమగుట వేలకొలది మహమ్మదీయు లాక్షేత్రమును దర్శించివత్తురు. మక్కాను గూర్చి మన మెరిగినంతవరకు జెప్పికొందము.

ముస్లింమతమును స్థాపించిన మహమ్మదుగారు 7 వ శతాబ్దమున మక్కాలో జననమంది తనజీవిత మంతయు అరేబియాదేశములో గడపి గుస్థితియందున్న తనజాతిని ఉద్ధరించి తనప్రోత్సాహమున వారిని మహావీరులుగ నొనర్చి 622 వ సంవత్సరములో మరణించెను. మహమ్మదుగారి మతోపదేశము లన్నియు నరబ్బీభాషలోనే పుట్టినవి.

మహమ్మదుగారిచే సృష్టింపబడి ప్రచారింపబడి స్థిరీకరింపబడిన ముస్లింమత మేర్పడుటకుముందు ఈమక్కాపట్టణ మాప్రాంతమున నొక గొప్ప వర్తక కేంద్రస్థానము, పెద్ద రేవు స్థలము. అచటి యరబ్బులు ముందునుండియు నట "కాబా" యను రాతిబొమ్మను దేవతగ నెంచి పూజించి యాత్రాస్థల

ముగ నెంచువారు మహమ్మదు వారికి మతోపదేశమును జేసి విగ్రహారాధనకూడదని బోధించి మాన్పించెను. కాని మక్కా పట్టణమును యాత్రాస్థలముగ నంగీకరించెను. ఆయనకుబిమ్మట ననేకమంది ముస్లింధార్మిక ప్రచారకుల కానగర మావాసమయ్యెను. అట్టి పవిత్ర క్షేత్రంబున జన్మించిన అజాద్ పండితపుత్రుడే యయ్యెను, పండితునిసంతతి మూర్ఖులగుదురను అపవాదును తొలగింపజేయునంతటి యశోవంతు డగునను టలో నావంతయు సంశయ ముండవచ్చునా?

౨

## విద్యాభ్యాసము

"విద్య నిగూఢగుప్త మగు
విత్తము రూపము పురుషాళికిన్
విద్య యశస్సు భోగకరి
విద్యగురుండు విదేశబంధుడున్
విద్య విశిష్టదైవతము
విద్యకు సాటిధనంబు లేదిలన్
విద్య నృపాల పూజితము
విద్య నెఱుంగనివాఁడు మర్త్యుడే?"

అజాద్ అనగా స్వతంత్రుఁడు అనియర్థము. ఈస్వాతంత్ర శక్తి బాల్యమునం దేయలవడెను. ఆ కారణముచేతనే ఆయన చిన్నతనమందు ఏపాఠశాలలోను జదువకొనలేదు. తండ్రివద్దనే తీరుబాటువేళలందు నేర్చుకొనువాఁడు. కాని నిరంతరము ఏదో యొకపుస్తకమును జదువుచుండువాఁడు. నేటి బడిపిల్లలవలె నాయన జననీజనకులిచ్చిన పైకము నితరముగా వెచ్చించి వారిని మాయలో బడవైచి అదనముగా పైకమును లాగి వ్యసనములకై వ్యయపఱచుట, వారికన్నీరుద్రావుటకు పుస్తకములను చేతబట్టుట యింక నేవేవియో జేయునట్లుగాక కేవలము విద్యయందలి యభిమానమును, అభిలాషమునుబట్టి ప్రాకులాడువాఁడు. చేతికే గ్రంథము దొరికిన దానిని యర్థము తెలిసినను తెలియకపోయినను తుదకంట జదువుట పరిపాటిచేసికొనెను.

ఆయనకు జ్ఞానశక్తి యతిబాల్యమందే యలవడెను. అట్టిప్రాయమున దీక్ష, పట్టుదల మొదలగునవి యననేమో తెలియవు. అట్లయ్యును వయసునకు మించిన గ్రంథావలోకనము నలవాటు చేసికొనెను. పిమ్మట తండ్రియనుమతిపై ఆఫ్రికాఖండమందలి ఈజిప్టు దేశమునకు రాజధానీనగరంబగు కైరోపట్టణమున విద్యాభ్యాస మొనర్ప నేగెను. ఆ మహానగరము నైలు నదీతీరముననున్నది. ఆఫ్రికా దేశము భారత దేశమువలె మహానదులతోను వివిధధాతూత్కృష్టమైన శైలంబులతోను నిండియుండి ప్రాచీననాగరికతావైభవమునుచాటుచున్నది. ఇందలి

ప్రజలలో అధికసంఖ్యాకులు మహమ్మదీయులే. నేటిముస్లిం దేశములలో నిది యాలోకసామాన్య ప్రతిభాయుతమైనది సారవంతమైనది, ఫలవంతమయినదియు నీదేశమే.

ఇచట పెక్కు విద్యాకేంద్రములును 'ఆల్ హాజర్' అను గొప్పవిశ్వవిద్యాలయమును ననేకమహమ్మదీయ విద్యాసంస్థలు నున్నవి. అజాద్ ఆ విశ్వవిద్యాలయములో నున్నత విద్య నభ్యసింప మొదలిడెను. బుద్ధిమంతునకు సాధ్యముకాని దేమియుండును? ఆయన మిగుల పిన్నతనమందే ముస్లిం మతమునకును తత్త్వశాస్త్రమునకును పాశ్చాత్యవిజ్ఞానమునకును సంబంధించిన గ్రంథరాజముల నాప్యాయముగ జదువుచుండువాడు. మిగుల కుశాగ్రబుద్ధి యగుటవలన 15 ఏండ్ల వయస్సు వచ్చునంతవఱకే ముస్లింవిద్వాంసులలో ప్రముఖుడు తత్వజ్ఞుడునని పేర్వడసెను. పదునారవయేటనే విశ్వవిద్యాలయమును విడనాడెను.

ఆయన విశ్వవిద్యాలయమును విడచునప్పు డచటిబోధకులును, తోడివిద్యార్థులును విశ్వవిద్యాలయమును వీడిపోవుటకు విచారమును వెలిబుచ్చుచునే యమితోత్సాహముతో వీడ్కోలు నిచ్చిరి. ఆ సమయమునన చట గొప్పయుత్సవమ్ములు జరిగెనట. దానికి అజాద్ ఎక్కువగా సంతోషమును జూపలేదు, కారణ మాయననిరాడంబర జీవనాభిలాషియగుటయే.

ఈజిప్టు ఆదిలో స్వతంత్ర దేశము కాని, తర్వాత టర్కీ సామ్రాజ్యములో నొకభాగముగ నైనది. కారణాంతరము

లచే టర్కీసుల్తాను దుర్బలుడు కావటంతోటే తత్పరిస్థితులను క్రీగంట జూచుచున్న పాశ్చాత్యప్రముఖులగు బ్రిటిషువారును ఫ్రెంచివారును ఈజిప్టులోని ప్రత్తిపంట వగైరాల నానుకొని నచ్చుటకు జేరిరి. రాజ్యతంత్రవిశారదులైన ఆంగ్లేయులు నెపోలియను యుద్ధము ముగియగనే యట రాజకీయపు ఎత్తులను వేయనారంభించిరి. ఆదిలో తమ పలుకుబడిని పెంపొందించుకొనుటకు మనదేశమందువలే చిన్నచిన్న తగవులు కల ఆయా దేశీయసంఘములలో కొన్నిటియందజేరి యని యెక్కువగు నటుల దోహదముచేసిరి. టర్కీసుల్తాను నామమాత్రుడుగ నధికారియేగాని చేవలేకపోయెను. ఈజిప్టు రాజును ఆంగ్లేయులు తమ గుప్పిటలో నిమిడ్చికొని తమ యధికార ప్రాబల్యమునకు పునాది వేసికొనిరి.

ఆ సమయమున నచ్చట ప్రజానాయకుడుగనున్న జగుల్‌పాషా ప్రజలకు సంఘీభావమును ఐకమత్యావసరమును బోధించి జాతీయతను నిర్మాణింప యత్నించుచుండెను. ఈజిప్టురాజు నండగా జేసికొని యాదేశమందలి అల్పసంఖ్యాక సంఘీయులయెడ కృత్రిమప్రేమ నటించుచు వారిక్షేమమును జూచుటకు తామిచ్చటనుండు టత్యవసరమని వెల్లడించుచుండిరి. జగులుపాషా చేసెడి తీవ్రయత్నమును బ్రిటిషువారి కుతంత్రపన్నాగములనుజూచుచున్న యువకుడగు అజాద్ అంతదనుకనే తనహృదయక్షేత్రమున నంకురించి

మొలకలు దేరిన స్వాతంత్ర్య బీజములను వెలికిదెచ్చుట కిదియే యదననియు ప్రజా బాహుళ్యమునందు శీఘ్రకాలములో నైక్యత సమకూర్చుట అత్యవసరమనియు గ్రహించి తన స్వాతంత్ర్య ప్రజ్ఞాభావములను ఫిరంగులతో ఆంగ్లేయుల భావ్యధికారపు పునాదిరాళ్ళను పెల్లగింప నుంకించినాడు.

ఆయన లేతవయసువాడయ్యు, మనీషాచైతన్యమున వృద్ధునిపగిది కైరోపట్టణమున స్వాతంత్ర్యబోధ కుపక్రమించినాడు. ఆయనతండ్రి మతాచార్యుడై మహాపండితుడై యనేక మతగ్రంథములను రచించిన ప్రజ్ఞాశాలియయ్యు తన కన్నకొడుకు పజ్జమాత్రము పిన్నయైనాడు. ''పుత్రాదిచ్ఛేత్పరాజయం'' అన్న లోకోక్తి ఆమహానీయునిపట్ల సార్థకమయినది.

అజాదు తండ్రి రచించి యచ్చొత్తించిన పొత్తముల నామూలాగ్రముగ సవిమర్శముగ పఠించి యందలి విశాల భావములను జీర్ణముచేసికొనెను. అంతటినుండి యొకవంక స్వాతంత్ర్యదీక్షాబోధయు, వేఱొకవంక మహాపండితులతో శాస్త్రచర్చయు, మఱొకవంక స్వమతాచారప్రకృతిని వెల్లడించుటయు మొదలుపెట్టినాడు. అంతతో నాగక, తనమతస్థుల వారికి వలసిన సంస్కరణములను జేయనారంభించి దానికి పత్రికాప్రకటనము మిగుల దోహదమిచ్చునని 'లిసానల్ సిద్క్' అనుపత్రికను ప్రకటింప మొదలుపెట్టెను. ఆపత్రికలో ఆయన

వ్రాసిన వ్యాసములను గాంచిన యచటిపండిత ప్రకాండు లలో ఉద్దండులగు మౌలానాశిబ్లి మున్నగువారు అత్యం తాశ్చర్య సాగరమున దోగి అజాదుమనీషాప్రతిభకులోలోన సంతసించుచుండువారు. ఇతడు భావికాలమున ననంతయశో విశాలిమై విరాజిల్లగలడని తమ హృదయసీమల దలంచు వారు. ఆయన మనీషాధిషణను వెల్లడించుటకు 1904 లో బొంబాయి నగరమునకువచ్చి యచ్చటి పండితమ్మన్యులతో శాస్త్రవాదము లొనర్చి తిరిగి యీజిప్టునకు మరలెను.

## 3

## పత్రికా ప్రచురణము

"భువనశ్రేణి వహించు శేషుడు ఫణా
భోగంబుపై సంతతం
బవలీలన్; భరియించు పృష్ఠమున గూ
ర్మాధీశ్వరుం డాతనిన్
ధవళక్రోడవశాత్ము జేయు నతనిన్
వారాశి యశ్రాంతిచే
నవురా! ధీరచరిత్రసంపద లసం
ఖ్యాతప్రభావోన్నతుల్"

అజాద్ పండితుడు బొంబాయినుండి స్వదేశమున కరిగినదాది మరల భారతావని కెపుడు పోవుదునాయని యువ్విళులూరుచు తండ్రితోగూడ ఢిల్లీపట్టణమునకు వచ్చి తనపూర్వీకుల యావాసము జేరెను. స్వాతంత్ర్యప్రియుడును మనీషావంతుడును యువకుడునైన అజాదు పెద్దధనవంతుడు కాకపోవుటచే నేదియును జేయలేక రెండుమూడు నూరసములవఱకునిరంతర మేదో యాలోచనా పరంపరలో మునిగియుండువాడు. హిందూస్థానమతనికి నూతనము చేయూత నిచ్చువారు లేరు. ఒకరి నాశ్రయించుబుద్ధి యతనికి మొదటే లేదు. అందువలన ధీరుడును, ఉత్సాహవంతుడు, దేశాభిమానియు, త్యాగియునైన యతడు అప్పటికి మనదేశము సంచరించి నవిద్యాధికుల యెదలయందలి జాతీయభావముల గ్రహించి వార్తాపత్రికల ద్వారా సంఘసేవ చేయ కృతనిశ్చయు డయ్యెను.

అందులకై హిందూస్థాన మంతయు నొక్కసారిగ సింహావలోకన మొనర్చెను. వెంటనే యతని యెట్టయెదుట నాటి పంజాబు రాజధానియగు లాహోరునగర మందలి ఉర్దూపత్రికారాజంబైన "వకీలు" అను పత్రిక నిలచెను. దానికి వ్యాసములను వ్రాసి పంపువాడు. అతని రచనాధోరణినిజీర్ణించుకోన్న పత్రికాధిపతు లతనినే సంపాదకునిగ నేర్పఱచిరి.

కొంత కాల మెట్లో యుండు గడపి పిదపతన స్వాతంత్ర్య భావములను బెంగాలుప్రపంచమున స్వేచ్ఛగా వెదజల్లుటకుఇంత

కన్న తనకే ప్రత్యేకముగ పత్రిక యుండుట శ్రేష్ఠమని భావించి యటనుండి భారతదేశ భాగ్యసీమయనదగిన కలకత్తానగరము నకు 1912 లో చేరెను, అట స్వంతముగ "అల్ హిలాల్" అను పత్రికను ప్రచురింప నారంభించెను. అందు హిందూమహమ్మదీయ సంఘములందలి దురాచారములను జంకుగొంకు లేక ఖండించుట, సాంఘిక నైతిక రాజకీయభావముల నుద్బోధించుట ఈ రెండుజాతులును తమతమ మతప్రవక్త లుపదేశించిన సదాచారమార్గముల నెట్లుల్లంఘించుచున్నారో నిజమైన పవిత్రభావము లెట్టివో సంఘక్షేమ మొనర్చు నాచారముల నెట్లవలంబింపవలెనో శాస్త్రవిహితముగ చర్చించి ప్రచురించుట మొదలిడెను. కొలదికాలములోనే యతనియద్భుత మనీషా వైశద్యము, పరిజ్ఞానవేత్తృత్వము, శాస్త్రపాండితీగరిమలను భారతీయులు గ్రహించిరి.

నేడు కీర్తిశేషులై యశఃకాయములతోనున్న బాలగంగాధరతిలక్ మొదలగు మహనీయులు, రామమోహనరాయల వంటి సంస్కర్తలు, సజీవులై యున్న మదనమోహనమాలవ్యా రాధాకృష్ణ పండితుడు మున్నగువారును హైందవప్రజానీకమునకు ధర్మనిర్వహణమున నెట్టి సేవ జేసి చుయుచున్నారో ఆజాద్ పండితుడు మహమ్మదీయ ప్రజానీకమునకుపకరించునట్టి ధర్మసేవ జేసెను. కొలదికాలముననే అల్ హిలాల్ పత్రిక అజాదుబుద్ధి కుశలతవలనను, జాతీయ స్వాతంత్ర్య ధర్మనిర్వహణాదిక భావ

పరంపరలతో నిండిన వ్యాసరాజములవలనను ఉర్దూపత్రికలలో నగ్రస్థానము వహించెను.

అజాదుపండితుని పత్రికాపుత్రిక నిరాఘాటముగ నుర్దూప్రజలలోనేగాక భారత దేశమందు వివిధభాషలలో పత్రికల నుత్సాహముతో జదువు ప్రాంతముల నన్నింట తిరుగ జొచ్చినది. అప్పటికి భారత దేశమందలి ముస్లిముల పరిస్థితు లధోగతిగో నున్నవి. మొగలాయిసామ్రాజ్యభానుబింబమ_స్తమించి ఈస్టిండియావణిక్సంఘశక్తి భారత దేశమున కాలువెట్టి నను మహారాష్ట్ర రాజపుత్రస్థానములలో హిందూరాజ్యములును, పంజాబురాష్ట్రములో సిక్కురాజ్యములు ఏర్పడినను యందందు మహమ్మదీయరాజ్యములు లేకపోలేదు. కాని వారు పరస్పరకలహములతో విసిగి పరిపాలనాదక్షత క్షీణించి క్రమముగా ఆంగ్లేయులకు వశులై వారిచేతిలో కీలుబొమ్మలుగా నుండిరి.

బ్రిటిషువారు అయ్యదను గనిపెట్టి భారత దేశమందలి జనసంఖ్యలో సుమారు మూడువంతులకు మించిన మహమ్మదీయులకును, తక్కినహిందువులకునుకలతలు పెట్టనారంభించిరి. ఈవిషయమున, వీరెంతదిట్టలో భారతీయు లప్పుడెఱుగకపోయినను కొంత కాలమునకు దెలిసికొనిరి. ముస్లిములెప్పుడైనతిరుగ బడిస్వతంత్రతనొంది స్వపరిపాలనముసాగించుదు రేమోయన్న

భీతిచే ముందధికసంఖ్యాకులైన హిందువులపై కృత్రిమప్రేమ జూప మొదలిడిరి. దానితో ముస్లిములు నిర్వీర్యులైరి.

ఇంతలో కొందఱు హిందువులు భారతస్వాతంత్ర్యభావముల వెల్లడించి బ్రిటిషువారి నిటనుండి సాగనంప యత్నింప మొదలిడిరి. అది కనిపెట్టి ఆంగ్లేయులు అపు డల్ప సంఖ్యాకులును శూరులును నైన మహమ్మదీయులను చేరదీయ నారంభించి హిందువులపై లేనిపోని నేరములను జెప్పి మిమ్ముల నుద్ధరింప బద్ధకంకణులమై యున్నామని సూచనల జేసిరి. ముస్లిం పెద్దలు కొందరాతంత్రములో బడి తలలూచిరి. ఆయండ జూచుకొని హిందువులను నిరసింపుచు మహమ్మదీయులలో విద్య కొఱతగా నున్నదికాన ఆలోపములు ముందు సవరింతుమని ముస్లిమ్‌లకు ప్రత్యేకకళాశాలలను గొన్నింటి నేర్పఱచియు కొందఱి కుద్యోగములనిచ్చియు, మఱికొందఱకు బిరుదుల నిచ్చియు బంగారుహారతుల నెత్త మొదలిడిరి.

దానితో ముస్లిములు హిందువులను ద్వేషింప మొదలుపెట్టిరి. అంతి కలతత్వమను మహామారి జనించి క్షణక్షణమభివృద్ధి నొంద నారంభించెను. హిందూమహమ్మదీయ తెగలలో ప్రముఖులైనవారు పదవులకును బిరుదములకును ప్రాకులాడ మొదలిడిరి. ఆంగ్లేయులు చంక లెగురవైచిరి. ఏమైననేమి, అచిరకాలములో హిందూమహమ్మదీయులు పరస్పరశత్రువులైరి ఒకరి కొకరు లోలోన గోతులు త్రవ్వ నారంభించిరి.

అంతతో హిందూమహమ్మదీయసఖ్యత యను లత కృశించి కృంగిపోయినది.

నేటికిని చిరస్మరణీయముగ నెన్నదగియున్న హిందూ మహమ్మదీయమైత్రి యీనాటిదా? మహమ్మదీయులు ఏడు వందలేండ్లు పరిపాలన సాగించిరి. వారు తరతరంబులుగ భారత భూమిని జన్మభూమిగ జేసికొనిరి. మతవిషయములలో నేయొక రిద్దరో కొఱమాలిన పట్టుదల కలవా రున్నను ధర్మపరులును నీతివంతులునైన అక్బరుపాదుషా ప్రభృతులు సమత్వబుద్ధితో భారతీయసంతతికిని తమవారికిని మైత్రినిగూర్చ లేదా? షర్షా చక్రవర్తి యేలుబడి కొలదికాలమేయైనను రామరాజ్య మని పించుకొనలేదా? అక్బర్షా రాజ్యమును దేవరాజ్యమని యెం దఱు హైందవపండితులు తమవాక్సుధాలహరితో కావ్యశ్రేణి నిర్మింపలేదు? తమవారితో హైందవులకుగూడ ఉన్నతోద్యో గంబులిచ్చియు, తను కవులతోబాటు హైందవకవీంద్రుల నాస్థానమందుంచియు, హిందూమహమ్మదీయ మతంబుల కొక్క విధమైన గౌరవంబె కల్పించియు అంతతో బోక హిందువుల నెయ్యముతోబాటు వియ్యములను నిలుప యత్నించిన యక్బరుచక్రవర్తి సమత్వపాలనమును హిందువు లేనాటికైన మఱువగలరా?

ఇంతయేల? నవరత్నంబుల నైజకాంతి నింపి రెండవ యింద్రధనువోయన నొప్పుచు మేల్మి బంగారు పింఛమాకృ తితో నేటికినిగూడ యద్వితీయచిత్రంబని దిగ్దేశముల కీర్త

నీయమగుచు విలువ యెంతో చెప్పరానిదైన మయూరసింహాసనమును జగత్ప్రసిద్ధిగన్న తాజమహాలును, మఱియు పెక్కు మహాసౌధములను నిర్మించి భారతావనిలో ధనరాసులను విరజిమ్మిన షాజహానుచక్రవర్తి యాకృతి హిందూప్రజల హృదయసీమనుండి యెన్నడైన వీడిపోగలదా ? హిందూ మహమ్మదీయమైత్రి సుస్థిరత్వమయిన దని నిరూపింప నింతకన్న నెక్కుడు నిదర్శనములు గావలెనా ?

రాజ్యతంత్రజ్ఞుల కివి యవసరమా ? వెఱ్ఱియూహ ! తుదకు ఆంగ్లేయచరిత్రకారులు పాఠశాలలందు బోధించుచారిత్రకగ్రంథములందుగూడ నొకతావునకంటె వేరొకతావున మహమ్మదీయ నిరసనమును జూపి హిందువులకు మహమ్మదీయసోదరులపై ఏహ్యాభావమును బుట్టించిరి. భారతదేశమందలి విద్యాధికులలో గొందఱు ఈపరిస్థితినిగమనించి రాజకీయ స్వాతంత్ర్యవాంఛను భారతీయులలో రేకెత్తించినగాని యిది చక్కబడదని స్వరాజ్యోద్యమ మారంభించిరి. నూతనోద్యమముల నచిరకాలములో నలువంకలకు వ్యాపింపజేయు ముఖ్యసాధనము వార్తాపత్రికయే. అయితే మనదేశమున వివిధప్రాంతములందు వివిధభాషలేగాని ఏకైకభాష భారతీయులకు లేకపోయెను.

అట్టిసమయమందు అజాదుపండితుడు కలకత్తానుండి తన ఉర్దూపత్రికద్వారా బహిరంగముగను అన్యాయదేశంబు

గను బ్రిటిషువారి కుతంత్రములను వెలువరింప మొదలి డెను. ఆపత్రికాపఠనంబువలన మహమ్మదీయులలో జాతీయ వాంఛలు రేకెత్తెను. ఆంగ్లేయు లాపత్రిక యొక్క ప్రతిభకును అజాదుధైర్యమునకు గుండెపగిలినట్లయి ప్రెస్ ఆక్టు అను పేరిట విచారణ లేకుండగనే ధరావతును బుచ్చుకొనియు నిషేధించియు దాని నణచివేయ నుద్దండయత్నమును సలిపి తుదకు కృతకృత్యులైరి. 1915 లో ఆ పత్రికను అణచి వేసిరి.

స్థిరసంకల్పుడైన అజాదు అంతమాత్రమునకు జంక లేదు. వెంటనే "ఆల్ బలాగ్" అను పత్రికను నడుప మొద లిడెను. అంతలో మొదటిప్రపంచయుద్ధము వచ్చినది. టర్కీ శత్రుపక్షమున జేరినది. టర్కీని అణచుటకు ఇంగ్లీషువారు చేయుచర్యలను అజాదు తీవ్రముగ నందు నిరసించుటయు జాతీయోత్సాహమును ఇబ్బడిగ ప్రోత్సహించుటయు దొర తనమునకు కన్నుగుట్టె దానిని నిషేధించిరి. అయినను ఆయన మాత్రము ప్రబోధమును మానలేదు.

ఆసమయమున ఆలీసోదరులు ముస్లిముల పుణ్యక్షేత్ర రక్షణకై టర్కీరాజ్యమధికారము గల్గియుండవలెనని నిరూ పణజేసిరి. అజాదుగూడ వారి ననుసరించెను. అజాదుబోధనా శక్తి గంగాప్రవాహంబువగిది నల్వంకల బాఱుచుండ దొర తనము దాని నరికట్ట 'నీవు ఢిల్లీ పంజాబుమదరాసుప్రాంతము లకు పోకూడదని భారతరక్షణ చట్టమును నూతనశాసన ముతో నిషేధించుట యేగాక బెంగాలు వదలిపోవలెనని

'యాజ్ఞ యిచ్చిరి. ఆయన బీహారులో మకాము చేసెను. తుద కెక్కడ కేడితే అక్కడకు వెంటాడించి నిర్బంధించిరి. 1916 నుండి యించుమించు మూడేండ్లు కారాగారమున నుండెను.

ప్రభుత్వవిరోధియయ్యు గూడ నాధీశాలి వ్యాసంగమును మానక అనేక ఆధ్యాత్మికగ్రంథములను రచించెను. అంతలో ఆంగ్లేయులకును టర్కీకిని సంధి జరిగి యజాదును విడచిరి. ఆయన సరాసరి కలకత్తా చేరి తాను వ్రాసిన గ్రంథములనచ్చొత్తింప మొదలిడెను. దాని కెన్నో అడ్డంకులు వచ్చినవి. కొలది కాలములో రాజకీయపరిస్థితులు తీవ్రము లైనవి. అజాద్ మరల తన స్వాతంత్ర్య దీక్షాశంఖానాదము వినిపింపజొచ్చెను. 1919లో మహాత్మాజీ రాజకీయరంగమున దూకెను. వీరిరుభయుల భావములు కలిసినవి. మహాత్ముల మైత్రియు పట్టుదలయు నెంతటి పనినైన జేయించునుగదా?

## ౪

## ఉద్యమము

''ఆరంభింపరు నీచమానవులు వి
ఘ్నాయాసనంత్రస్తులై
ఆరంభించి పరిత్యజింతు రురు
విఘ్నాయత్తులై మధ్యముల్

ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్
ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరుసుమీ
ప్రజ్ఞానిధుల్ గావునన్."

ప్రపంచమందే దేశమందుగాని ఏ కాలమందుగాని అనేకవిధములైన ఉద్యమములు పుట్టుచుండును పెరుగుచుండును — అంతరించుచుండును. కాని కొన్ని పురిటిలోనే యెన్నెమ్మవాత బడును. మఱికొన్నిటికి అర్ధాయుష్యమే యగును. వేఱుకొన్నిటికి మధ్యమాయువు — ఇట్లే ఆయుద్యమారంభకుల ప్రవృత్తినిబట్టి న్యూనాధికత్వ దశల నందుచుండును. 1921 లో మహాత్ము డారంభించిన అసహాయోద్యమము గమనింపుడు అందు అబ్దుల్ కలాంగారుగూడ నడిగిరి. అంతదనుక ఆలీసోదరులు ఖిలాఫతునుగూర్చి లండను వెళ్ళినిరుత్సాహులై వెనుదిరిగివచ్చి మహాత్ముని యనుగుజాడలలో నడువ అసహాయోద్యమరంగమున నుఱికిరి.

ఈఖిలాఫతుసమస్య స్వభావ మెట్టిదనగా ముస్లిముల తీర్థక్షేత్రములను కాపాడ నర్హతకల "ఖలీఫా" అను నొక వ్యక్తిత్వస్థితి. అనగా మహమ్మదీయులలో నొక గొప్పవానిని జూచి వారందరు అతనిని ఖలీఫా యందురు అట్టిడు ముస్లిముల తీర్థక్షేత్రసంరక్షణమునకు బాధ్యుడు. టర్కీసుల్తాను ఆనాటికి

ఖలీఫాయయ్యెను. కాని టర్కీ దొరతనమున కెదిరిగ నిలచి పోరాడుచుండెను. దానిలో జరిగిన సంధిసూత్రములలో లాయడుజార్జిగారు ముస్లిముల ఖిలాఫత్తునకు నష్టము రానీయ నని పూచీ యిచ్చెను. వెనుక టికోపమును మనసులోనుంచు కొని యాంగ్లేయులు టర్కీయెడ మిగులనిరంకుశముగా వర్తించి సుల్తానును వశపఱచుకొనిరి. టర్కీయువకు లందుపై గినిసి కెమల్ పాషా నాయకత్వమున ఆసియాటర్కీలో స్వతంత్ర రాజ్యమును స్థాపించుకొని అంకారాపట్టమును రాజధానిగ జేసి కొనిరి. స్థాపించుకొని అంకారాపట్టణమును రాజధానిగ జేసి కొనిరి. ఖలీఫాయైన టర్కీసుల్తాను స్వదేశమునుండి పలాయ నమై బ్రిటిషువారికి దాసుడై యుండెను. అప్పటినుండి వారు ఖిలాఫత్తునుగూర్చి పలువిధముల ప్రచారము చేయ మొదలిడిరి.

భారత దేశమందు హిందువులజనసంఖ్య యధికము. తరువాత హెచ్చుజనాభా మహమ్మదీయులదే. మన దేశమం దెక్కువగ మహమ్మదీయు లుండుటచే ఖిలాఫతు ఉద్యమము తీవ్రవ్యాపకము చేసిరి. దానికి ముఖ్యనాయకులు ఆలీ సోదరులు, అజాదుపండితుడును.

మన దేశమందలి ముస్లిములు వారికి సువర్ణహారతుల నెత్తిరి. ఆలీసోదరులలో పిన్నయగు మహమ్మదాలీగారు వయ సున అజాదుకన్న పెద్ద. కాంగ్రెసు ఉద్యమమున ఖిలాఫతు సమస్యను జేర్చి ప్రోత్సహింతుమని వాగ్దానమిచ్చిన గోకాము

కూడ స్వాతంత్ర్యోద్యమమున జేరుదుమని ముస్లిమ్‌సోదరులు కోరగనే గాంధీప్రభృతులు దాని కంగీకరించిరి. ఈ విషయమున అజాదు చేసిన విశ్వప్రయత్నము వర్ణనాతీతము. చూపిన సహనశక్తి అనన్యసాధ్యము. ఆలీసోదరులూ అజాదు పండితుని పరిష్కారప్రయత్నధిషణాశేముషీ విభవమునకు నిశ్చేష్టులై తలలూపిరి.

1920-21 సం॥లలో అసహాయోద్యమ మతితీవ్రమై సత్యాగ్రహసభ నలువురు సభ్యులతో నిర్మాణింపబడినది. ఆ నలువురిలో అజాదుపండితు డొకరు. ఆసమయమున వేలకొలది గ విద్యాధికులు ఉద్యోగములను మనఃపూర్వకముగ విడనాడియు, న్యాయవాదులు న్యాయస్థానములను బహిష్కరించియు విద్యార్థులు కొలదిదినములలో పట్టభద్రులు కానున్నవారు కూడ కళాశాలలను పరిత్యజించియు, ఉన్నతపాఠశాలలలో జదువు విద్యార్థులు చదువునకు స్వస్తి చెప్పియు, శాసనసభా సభ్యులు తమసభ్యత్వమునకు రాజీనామాలిచ్చియు బహిష్కార విప్లవమును లేవతీసిరి. దానితో ప్రభుత్వగౌరవము తగ్గుటయేగాక వారి కాందోళనకూడ యధిక మయ్యెను.

ఆసమయమున వేల్సుయువరాజుగారు మన దేశమునకు సంచారము వచ్చిరి. అప్పటిపరిస్థితులలో ఆయన సంచారము వలన దొరతనము వారిపై మరల మక్కువ యేర్పడునను

ఆశతో అది ఏర్పాటుచేయబడినది. ఆయన వచ్చుసందర్భము చాల గంభీరముగా జరుగుటచే తత్కార్య క్రమమున కాంగ్రెసువారు పాల్గొన నిచ్చగింపక పోవుటయేగాక మీదు మిక్కిలి యందులకై జరుపు నుత్సవములను బహిష్కరింప నిశ్చయించిరి. బొంబాయిలో యువరాజు దిగగానే కాంగ్రెసు ఆదేశమున వీధులన్నియు నిర్జనములైనవి. కలకత్తాలో కూడ సి. ఆర్. దాసు అజాదుపండితుడును తీవ్రప్రచారము చేసి బహిష్కారమును సాగించిరి.

ప్రభుత్వమువా రందులకు కినిసి ముఖ్యనాయకులగు అజాదుప్రముఖుల నరెస్టు చేసిరి. ఆబహిష్కారోద్యమమును శాంతిభద్రతలతో సాగించు కాంగ్రెసు వాలంటరీ దళముల నక్రమసంఘములుగా ప్రకటించిరి. అజాదు తా నాసంఘమున జేరి యితరులను జేర్పింప ప్రచారము సలుప నాయనపై కేసు పెట్టిరి. కాంగ్రెసు ఆదేశానుసార మాయన విచారణలో పాల్గొన నిరాకరించి యొకస్టేట్మెంటునుమాత్రము కలకత్తా ప్రసిడెన్సీ మేజస్ట్రేటుగారికి దాఖలుచేసెను. అందు తనసంగ తేమియు తలపెట్టక ప్రభుత్వమువారివలన భారతీయులకుజరుగు అన్యాయములను క్రోడీకరించి వ్రాసెను. 1922 ఫిబ్రవరి నెలలో బెంగాలుప్రభుత్వ మాపండితమ్మన్యున కేడాది కఠినశిక్ష విధించెను. 1923 లో అజాదు విడుదలపొందెను. అప్పటికి దేశములో నసహాయోద్యమము సన్నగిల్లి హింసాతత్వము చెల

రేగి అల్లరులు జరిగినవి, క్రమముగా బహిష్కారమును సాగిం చినవారు తమతమ వృత్తులలో పునఃప్రవేశము చేయజొచ్చిరి.

అంతలో శాసనసభల కెన్నికలు జరిగినవి. మితవాదు లును, కులతత్వ వాదులును అందు పదవులను స్వీకరించిరి. యువరాజుగారి సంచారమునకుపిమ్మట చౌరీచౌరా మున్నగు చోట్ల ప్రజలు దొమ్మి చేసి పోలీసులను బాధించిరి. మహాత్ము డీపరిస్థితులు గమనించి జనులలో హింసాప్రకోపము రేగినదని శాసన ధిక్కార ప్రయత్నము నాపుచేసిరి. అపు డేదో మిషపై మహాత్ముని దొరతనమువారు బందిఖానాలో నుంచిరి. కాం గ్రెస్సులో చీలికలు బయలు దేరినవి. వామపక్షమని కుడిపక్ష మని రెండుపక్షములేర్పడినవి. 1922 లో గయా కాంగ్రెసునకు అధ్యక్షుడయిన చిత్తరంజనదాసుగారు కాంగ్రెసువాదులు శాసనసభలలో పునఃప్రవేశ మొనర్చుట మంచిదని సూచిం చిరి. రెండవపక్షమువారయిన గాంధి మున్నగువా రంగీకరింప లేదు. రెండుపక్షములవారికి తీవ్రవాదములు జరిగినవి. దేశ ములో చాలచోట్ల హిందూముసల్మానులకొట్లాటలు జరిగినవి.

ఈప్రజాకలహములు తీవ్రరూపమును దాల్చినవి. ఖిలా ఫత్తు ఉద్యమము నామమాత్రావశిష్టమై యున్నది. క్రమ ముగా రూపమే మాసిపోయినది. హిందూమహమ్మదీయులకు తగవులు హెచ్చెను. ఆసమయమునఅబ్దుల్ కలాంగారుఅజద్ గా రు కాంగ్రెసులో నాయాసంఘముల మధ్యనుహిందూముస్లింసంఘు

ము లమధ్యను సమన్వయము చేసి సఖ్యత గలిగించుటకు తన సర్వశక్తులను ధారవోసెను. మహాత్ములయినవా రెన్నియడ్డంకులు వచ్చినను తమపూనికను విడనాడక యనుమడించిన దీక్షాతిరేకమున సమితశాంతమూర్తులై కార్యశూరతను జూపుదురని పెద్ద లేనాటినుండియో భారతవర్షమున ప్రమోయించిన సంగతి యథార్థమనుటకు అజాదుగారి ప్రవర్తనయే ప్రబల నిదర్శనము.

## అధ్యక్ష పీఠము

''అసమానప్రియ నీతివర్తనము ప్రా
ణాంతంబునందుఙ్ మలీ
మస మగ్రాహ్యా మదుష్టయాచన మసం
పత్ప్రార్థనాభావమున్
వ్యసనావ్యాప్తిని ధైర్యమున్ బుధజనా
త్యంతానుకూలత్వ మీ
యసిధారావ్రతచర్య నెవ్వడు మహో
ర్య్వప్రేణికిం దెల్పెనో?''

కాంగ్రెసులోనుండి చీలిపోయిన స్వరాజ్యపక్షీయులు కాంగ్రెసును గూర్చివ్యతిరేక ప్రచారంచెయ్యకపోయిననుతమ

పక్షమున కనుకూలించు ప్రచారమునుసాగించుచునేయుండిరి. 1923 లో శాసనసభల కెన్నికలు జరుగ నుండెను. స్వరాజ్య పక్షీయు లాయెన్నికలలో పోటీచేయుదలంప కాంగ్రెస్ వారు బహిష్కరించిరి. ఈ విభేదము నెట్లయిన తొలగింపవలెనని అఖిలభారత కాంగ్రెసు కమిటీవారు నాగపురములో అజాదు పండితుని అధ్యక్షతక్రిందసభజరుప నిశ్చయించిరి. తుద కాసభ ఢిల్లీ నగరమున జరిగినది. ఆనా డధ్యక్షపీఠ మలంకరించిన అజాదుగారు ఆరెండు సంఘముల మధ్యనున్న విభేదములను తొలగించుటకై యత్నించిన కార్యక్రమము నెంతో చాకచక్యముగ నడపి రాజీసూచనల నిట్లు చేసిరి.

కాంగ్రెసు వాదులలో శాసనసభా ప్రవేశమున కిష్టమున్నవారు అందు పాల్గొనవచ్చును. రెండవపక్షము వారెవ్వరు నందుగూర్చి ప్రతికూల ప్రచారము చేయరాదని లోగడ జవహర్ పండితుడును తానును చేసిన సమాఖ్యనే అజాదుగారు పునరుద్ఘాటించిరి. దాని కన్నిపక్షములవారు నంగీకరించిరి.

స్వరాజ్య పక్షీయులు శాసనసభల కితరపక్షముల వారితో పోటీజేసి చాలచోట్ల విజయమందిరి. స్వరాజ్య పక్షమునకు కేంద్రశాసనసభలో వంగరాష్ట్ర పితామహుండగు మోతీలాలు నెహ్రూగారు నాయకులైరి. ఈపగిది రెండుపక్షముల మధ్యను తగవులు లేకుండుటకు అబ్దుల్ కలాంగారు

తోడ్పడిరి. ఆయనమాత్రం మెంపులోనుకూడ మోజు చూప లేదు. ఆయన కేవలం గాంధీపక్షీయుడుగా నుండి జాతీయ బోధయందును సాంఘికమైత్రి సమకూర్చుటయందును తగు యత్నములు మున్నగునవి చేయునిర్మాణకార్య నిర్వహణ దీక్షయందు మున్ని తేలుచుండెను.

హిందూముస్లింమతములు రెండును కొందఱ అవివేకులూహించునట్లు పరస్పరవిద్వేషకమతములు కావు. ఆయన హిందూమతగ్రంథములను, ముస్లింమతగ్రంథములను సమగ్రముగాచదివి మననము చేసికొన్నదిట్ట. ఆ రెండు మతవిషయకగ్రంథములందలి సామరస్యవిషయముల నాయన క్రోడీకరించి యేకముఖమున సమీకరించి యత్యద్భుతముగా ప్రబోధింపగల మహావక్త; కావున నే హిందూమతగ్రంథములలో పేరెన్నికగన్న భగవద్గీత మొదలగు సద్గ్రంథముల మహత్తత్వము నెఱింగించు అహింసాప్రేమను, సత్యదీక్షను, పరద్రవ్యానపేక్షిత్వమును, పవిత్రతను, నిగ్రహశక్తిని ముస్లిములకును, తన మతగ్రంథరాజమనదగు ఖురాన్ మొదలగునవి బోధించు అహింసా సత్యములే మతస్థిరత్వమున కాధారములని, కామక్రోధాదులు హానికరంబులని ఐకమత్య మవశ్యకార్యమని మొదలగు సదుపదేశములను హిందువులకును వచించుచుండును;

మౌలానా అజాదుపండితుడు రచించిన ఖురానుభాష్యమీనాడు ముస్లిములకు ముఖ్యాధారమని యెందరెందరో మత

కర్తలు ప్రశంసించియుండిరి; ఆయన వ్రాసిన ఖురాను భాష్యము నన్ని దేశములందలి ముస్లిం నాయకులును శిరసావహింతురు; అందువలననే యీమహామహుని హిందూ ముస్లిం నాయకులు సమానప్రేమతో నాదరించి గౌరవింతురు; ఈ రీతిగ ధార్మికోన్నతికై పాటుపడినవారిలో అజాదుగారే యగ్రగణ్యులు;

1923 లో కాకినాడలో జరిగిన కాంగ్రెసు మహాసభలో నాయకులందఱును శాసనసభాప్రవేశ మంగీకరించిరి దేశములో వివిధసాంఘిక వాదులును, శాసనసభాప్రవేశయత్నమును గావించిరి, మద్రాసు రాజధానిలో జస్టిసు అను నొక బలియమైన బ్రాహ్మణేతర పక్షము తనపలుకుబడి నుపయోగించి మంత్రిత్వము వహించినది ప్రభుత్వమువారు నిమ్న జాతుల వారికిని, అల్పసంఖ్యాక సంఘీయులకును ప్రాతినిధ్య మిచ్చితీరవలెననిరి. ఈ పద్ధతివలన కులతత్వవాదుల సంఖ్య అభివృద్ధి, వైమనస్యములు హెచ్చినవి. జాతీయ ముస్లిములలో అగ్రతాంబూల మందుకొన్న అజాదు, అన్సారీప్రభృతులు సమిష్టి నియోజకవర్గము లుండుటయే దేశక్షేమ దాయకములని లాభకరమని వాదించిరి; కాని ప్రభుత్వము తనదారినే నడచినది.

ఇంచుమించుగా నాసమయముననే భారత రాజ్యాంగమును పరిశీలించి, పరిశోధించి చట్టములను సవరించి భారతీయుల నుద్ధరిస్తామనే నెపమున విశేషధనవ్యయముతో మహాటెపితో సైమను సంఘ మొకటి యిండియాకు వచ్చుట కేర్పాటయినది; ఇది పలిసభ్యు లందరును యింగ్లండులోని పార్లమెం

టులో సభ్యులు; కొందఱు ముస్లిము లా సంఘమునకు బాస టయై సహకార మొనర్చిరి. అజాదు పండితుడు మాత్రము కాంగ్రెసు యాజ్ఞాప్రకారము ఆ సభవారిచర్యల నన్నింటిని ఖండించి భారతీయులసంస్కృతిని ముస్లింసంస్కృతిని సంస్క రించి జాతీయతను నీతిని ధర్మతత్పరతను వ్యక్తీకరించుచు నుద్బోధము చేసెను,

సైమన్ కమిషనును చాలచోట్ల మన దేశములో బహిష్కరించిరి. అప్పటికి స్వరాజ్యపక్షీయులకు ప్రభుత్వము వా రిప్పటికిని స్వరాజ్య మియ్య నిచ్ఛగింపరను భావము కలిగి శాసనసభలను వీడి వెలుపలికి వచ్చిరి; ఆ సంవత్సరము లాహోరులో జవహ్రాలుపండితుని యధ్యక్షత క్రింద, జరిగిన కాంగ్రెసు మహాసభలో భారతీయులకు సంపూర్ణస్వరాజ్యమే వాంఛనీయమని తీర్మాన మొనర్చిరి. అపుడు దేశములో నున్న కాంగ్రెసుసంస్థ లన్నివిధములయినవి యా తీర్మాన మును శిరసావహించినవి.

## ౬

## సత్యాగ్రహ సమరము

"శాసనసభలకు జన నెంచువారికి
ఓట్లు కోరిన మీర లొసగవలదు
పర దేశవస్తుసంభారంబు వాడుక చేయు
టందరు మాని వేయ వలయు

న్యాయవాదప్రవృత్తి డాయనీయక కోర్టులు
వెలిబెట్టుత్రోవలు వెదుకవలయు
పంచాయితీకోర్టులు ప్రబలించి వానిలో
తగవులు దీర్పగా నెగడవలయు
దొరతనపుపాఠశాలలు బిరుదములను
విడిచిపెట్టుడు పిల్లలు పెద్దవారు
మెసపుటోమియకూలీకి నిసగవలయు
సాత్వికనిరోధ మిదె యంచుచాటె గాంధి

దీనిని పురస్కరించుకొనియే దేశమంతటను సత్యాగ్రహము జరిగినది. ఉప్పుచేసిరని కొందఱను, విదేశబట్టలదుకాణములవద్ద కల్లంగడులవద్దనిరోధ మొనర్చిరనికొందఱను ప్రభుత్వ చట్టముల నుల్లంఘించిరనికొందఱను ఇట్లే వేలకొలదిజనులను నాయకులను అరెస్టుచేసి బంధిఖానాలలోనికిపడ గెంటిరి. నియంతయైన మహాత్ముని నిర్బంధింపగానే మఱింత యుద్రేకముతో జనులు తండోపతండములుగ వచ్చి నన్ను ముందు నన్ను ముందని సత్యాగ్రహ సమరాంగణమున విహరింప మొదలిడిరి. నాయకులలో ప్రముఖుల నందరను నిర్బంధమున నుంచిరి.

మౌలానా అజాదుగారు కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమున ప్రధానసభ్యులై జాతీయనాయకులై యున్నందునసత్యాగ్రహసమరమున దూకెను. ప్రభుత్వ మాయనను నిర్బంధించి కఠినశిక్ష విధించినది. ఇంతలో ప్రభుత్వము రాజీమాటలారం

భించి కొందఱు నాయకులను కారాగారములనుండి విడుదల చేసెను. 1931 లోగాంధీయిర్విను ఒడంబడిక జరిగినంతనసత్యా గ్రహులందఱుబంధిఖానాలనుండి వెలికివచ్చిరి. భావిరాజ్యాంగనిర్మాణమునకు లండనులో జరుపబోవు మహాసభకు భారతీయులకందఱ కేకైక నాయకుండైన మహాత్ముని ప్రతినిధిగా బంపిరి. ఆ సభకు బోయిన భారతీయప్రతినిధులుచాలతక్కువ. పోయినవా రందఱును ప్రభుత్వమునకు దాసాను దాసులుగ నున్నవర్గీయులే. అట్టివారినిమాత్రమే పిలిచిపట్టిచేతులుచూప దలచిన సభయని ముందె తెలిసిపోయెను. దాని యందలి యక్రమమును విమర్శించి జాతీయపత్రికలు మహోపకార మొనర్చినవి.

రెండు టేబిలుసభకు హాజరైనవారిలో ప్రముఖులైన జాతీయవాదులు మహానాయకులు వారు వీరననేల అన్నివర్గములవారును కోరినట్లుచేయక ప్రభుత్వముతనయిచ్ఛవచ్చినట్లు పోయెను. అప్పుడే భారతీయులు తమవిభేదాలను విడనాడినగాని స్వపరిపాలన మీయుదలంపు మాకు లేదని ప్రకటించిరి.

1931 లో దేశమంతయు నల్లకల్లోలమై నాయకులనందఱను తిరుగ బంధించి జైళ్ళలో నెట్టిరి. అప్పటిసత్యాగ్రహానియంత అజాద్ గారు ఆయనకూడ సత్యాగ్రహ మొనర్చి శ్రీకృష్ణజన్మస్థానమున కేగెను. అందు రెండేండ్లు గడపెను. ఆ పరిస్థితుల్లో ప్రభుత్వము లాటీచార్జి మున్నగు అక్రమము

లను వందలాదిగ జేసెను. అప్పుడు చాలమంది ముస్లిములు ప్రభుత్వసహకారులై సత్యాగ్రహమును వ్యతిరేకించిరి. ముస్లిముల కెన్నికలలో ప్రత్యేకనియోజకవర్గము లిచ్చినం దున నా రెండుసంఘములవారిమధ్యను కలత లభివృద్ధి నొందెను అది హిందూసంఘమునకూడ విభేదములను గల్గించునుగాన దీనిని నిరోధింపవలె నను భావముతో మహాత్ముం డుపవాస దీక్షకు గడంగెను.

అప్పటినుండిహిందూనాయకులు హరిజనుల నుద్ధరించు టకును, అస్పృశ్యతను రూపుమాపుటకును ప్రమాణములను జేసిరి. పై కారణము లన్నింటివలనను 1934 లో సత్యాగ్ర హోద్యమము చల్లారెను. ఆ సంవత్సరమున కేంద్రశాసన సభలకెన్నికలు రాగా కాంగ్రెస్సువా రితరవర్గములతో పోటీ చేసి వానిద్వారాకూడ కొంతపని చేయనచ్చునని అన్సారిప్ర భృతులూహించి అందులకు సిద్ధపడిరి. మౌలానా అజాద్ ఇది యెంతమాత్రమును లాభకారి కాజాలదని వాదించి మహా త్ముడంగీకరింపగనే మారుమాటాడక తలయూచెను.

ఎవరో కొందరు ఉబలాటపడి పోటీచేయగా విశ్వ ప్రయత్నమువిూద నందు కొందఱు విజయ మందిరి. అజాద్ గారివంటి మనీషావంతుడును, మేధాశాలియు, దూరదృష్టి యుతుడును, పరశ్రేయస్సహానుండును యోచించిన యోచ నకు వ్యతిరేక మగునా? మహాత్ములకు మామూలు దృష్టియే దివ్యదృష్టి కాబోలు!

౭

## పార్లమెంటరీబోర్డు అధ్యక్షపీఠము

"హృదయ వచ శ్శరీరముల
 నెంతయు పుణ్యసుధాప్రపూర్ణులై
ముదమున బహూపకారము ల
 మూడుజగంబులకున్ ఘటించుచున్
వదలక సాధుసద్గుణ ల
 వంబులు కొండలు సేసి మెచ్చుచున్
మదిని వికాసయుక్తు లగు
 మాన్యులు కొందఱు వోల్తురిద్ధరన్"

మానవప్రకృతు లేమి, సంఘశక్తు లేమి యెల్లకాల మొక్కరీతిగా నుండజాలవు, కాలక్రమంబున కాలగతిపగిదినే యనేక మార్పులనందుచుండును. శాసనసభలలో ప్రవేశించు విషయమై యొకప్పుడు తమలో దామ కలతలు పెంచుకొని చీలిన కాంగ్రెసునాయకు లిపు డేకముఖంబున నందఱును శాసనసభాప్రవేశమున కంగీకరించుట కాలగతిగాక మఱే మగును? 1936 లో జవహారుపండితుని యధ్యక్షత క్రింద లక్నోలో జరిగిన మహాసభలో పై విషయమునకు సుముఖ ముగ తీర్మానింపబడినది. తోడనే 1937 లో వచ్చిన యెన్ని కలకన్ని తావులందును కాంగ్రెసువారు పోటీకినిలిచిరి. నాయకు లందఱును కాంగ్రెసుసిద్ధాంతముల నమోఘముగా ప్రచారము

చేసి యన్ని కేంద్రములలో తమయభ్యర్థులను నిలబెట్టుట కొక పార్లమెంటరీబోర్డు స్థాపింపబడినది. అజాద్ గారు సంఘమం దొకసభ్యుడు ముస్లిములకు సంబంధించిన నిర్ణయము లన్నిటి నాయన నిర్ణయప్రకారమే జరుపుటకు స్థిరీకరింపబడినది.

ఈ సందర్భమున మౌలానా అజాదుగారు అపారమైన కృషిసల్పిరి. ఆ సమయమున జనాబ్ జిన్నాగారు ముస్లిము లలోవివిధపక్షముల వారికి భేదాదులు లేకుండనొకేజాతీయపక్ష మును నడిపింతునని వాగ్దాన మొసర్చి బహిరంగ పలికెను. లోగడ కొంత కాలము జిన్నాగారు కాంగ్రెసుసభ్యులై, ముస్లిం లీగునకు ఏకైక నాయకుడై దానితరఫున అభ్యర్థులను నియ మించెను జిన్నాగారి పలుకుబడి యద్వితీయము. కాంగ్రెసు జిన్నాగారి కిచ్చిన వాగ్దానము ననుసరించి చాలతావులందు కాంగ్రెసు అభ్యర్థులను నిలుపుట మానుకొనెను.

ఎన్నికలఫలితములలో నిలబడినచోట్ల కాంగ్రెసువారికే విజయము చేకూరెను. ఆరురాష్ట్రములలో కాంగ్రెసు మెజార్టీ వచ్చినది. కాంగ్రెసు వారు మంత్రిత్వము స్వీకరిస్తారా అనే ప్రశంస వచ్చేసరికి మంత్రులకు అధికారాలు పూజ్యము. అవసరం వచ్చినచోట్ల గవర్నర్లు అడ్డుతగులుతారు. ఇదిఏమీ లాభంలేని పనియని యీసడించేస్తే ప్రభుత్వంగవర్నర్లు కలుగ జేసికోరని మాటయిచ్చింది. అంచేత ఆరాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రిత్వాలనుస్వీకరించింది. ఎన్నివిధములైనక్లిష్టసమస్యలనో వారు పరిష్కారము చేయవలసివచ్చినందున అజాదుగా

రాభారమును వహించి యిటు హిందువులపట్ల, అటు మహమ్మదీయులపట్ల సమభావంతో ప్రవర్తించితనప్రజ్ఞను, ఓర్మిని ధారవోసి కాంగ్రెసుపాలకవర్గాలకమూల్యసలహాలనిచ్చారు. ఇందెప్పుడును భేదములు పుట్టకుండ పాలన సాగించుటకు కాంగ్రెసుసభవారు ముగ్గురు సభ్యులతో పార్లమెంటు కమిటీ నేర్పాటుచేసిరి.

అందులో శ్రీవల్లభాయిపటేలు, రాజేంద్రప్రసాదు, మౌలానా అబ్దుల్ కలాం అజాదుగారు మాత్రమే సభ్యులు వారుపరిష్కరింపవలసినముఖ్యకార్యములను దూరదాలోచన చేసి తొందరగా పరిష్కరించుచుండిరి. దీనికి గొప్పనేర్పు, విజ్ఞానము, ఓర్మి, సహనశక్తి యుండవలెను. అజాదుగారిసలహా ననుసరించియే మహమ్మదీయ సమస్యలు పరిష్కరింపబడు చున్నవి. అందాయన చూపిన సమభావ మద్వితీయము. ఇంతలో కొలతపడ్డ రాష్ట్రాలలోకూడా కాంగ్రెస్సు మంత్రిత్వాలను స్వీకరించినందున అజాదుగారి కార్యభారమధిక మయ్యెను. ముస్లిము లధికముగానున్న రాష్ట్రాలలో కాంగ్రెసుకు గాని, లీగుకుగాని మంత్రిత్వాధికారము లేక మిశ్రమమంత్రి వర్గా లేర్పడ్డాయి. ఇంతలో ముస్లిమునాయకుడైన జిన్నా గారు పూర్తిగ జాతీయభావములను విడనాడి సాంఘికస్వలాభము నేహృదయసీమనిడుకొనినందున క్లిష్టపరిస్థితు లేర్పడినవి. కాంగ్రెసువాదులలోనే సాంఘికతత్వాభిమానులుండి హింసా పద్ధతిచూపనారంభించిరి. దీనిని అజాదు, జవహర్లు పండితులు

మున్నగువారు సహింపజాలక యట్టివారు కాంగ్రెసులో నుండ ననర్హులని నిర్ణయించుటచే వారు కాంగ్రెసులోనుండి వైదొలిగిరి. అప్పటినుండి వారు తీవ్రముగా కాంగ్రెసునకు వ్యతిరేకముగ ప్రచారము చేయ నారంభించిరి. ఆసమయమున నజాదుగారు తమ బుద్ధివైశద్యమును, చాతురీధురీణతను, యుక్తిప్రతిభను జూపి క్లిష్టసమస్యలను చాల జాగరూకతతో బరిష్కరించుచుండిరి; ఆయన పరిశ్రమను, ఓర్మిని, ప్రజ్ఞా చాతుర్యమును న్యాయము నాకాంక్షించు విజ్ఞాను లందరు గమనించి ఓహో యని ప్రశంసించిరి.

కాంగ్రెసుపరిపాలన దేశములో జాతీయత విస్తరిల్లి నందున ప్రభుత్వమువారికిని, ప్రభుత్వమువారికి తలయొగ్గిన పత్రికలకును కన్నుగుట్టి యల్పసంఖ్యాకులకన్యాయముజరుగు చున్నదను నపవాదము గల్పించి కాంగ్రెసునకు ప్రతికూల ప్రచార మొనరించుటతోడనే యట్టివ్యతిరేకవర్గీయులకు సహా యము లభించినది; దానితో శాసనసభలలోనేమి బయట నేమి సంఘర్షణలు ప్రబలినవి. రాజ్యాంగపద్ధతి క్రొత్తచట్టము ననుసరించి మార్పుజేయ నవసరము కలిగినది. హిందూ మహామ్మదీయసమ్మేళన ప్రాబల్యముకూడ దానికత్యావశ్యక మైనది. ముస్లింలీగునకు ప్రభుత్వము కనుసైగ జేసినది. స్వదేశసంస్థానములలో భేదములుపుట్టించి యాస్వదేశసంస్థాన ముల పొందికి ఫెడరల్ ప్రభుత్వమున నధికార మొసగి ప్రజల నణంప యత్న మొనర్చిరి; అందుచే పలుకుబడియు, సమర్థ

తయు, మేధావిత్వముగల ముస్లిమునాయకునకే జాతీయ మహాసభయగు కాంగ్రెసుసంస్థ యధ్యక్షస్థాన మీయదలంచెను.

నాటికిని నేటికిని యట్టిపదవికి ముస్లిముప్రముఖులలో నన్నివిధములచేతను నర్హుడైనవాడు మౌలానాఅబ్దుల్ కలాం ఒక్కడే. ఆయన నిదివరలో 1939లో కాంగ్రెసునకు అధ్యక్ష పీఠ మలంకరింప వలసినదని గాంధీప్రభృతు లెంత వేడినను అంగీకారము చూపలేదు. ఆ త్యాగధనుడు పదవీ వ్యామోహము నాదినుండి నిరసించువాడు, అంతేగాక తనప్రాముఖ్యతనుగూర్చి బహిరంగపడుట కిష్టపడనివాడు. సిరింతర మా ప్రతిభాశాలి రాజకీయకోలాహలమున బడనిష్టపడక సర్వదా యాత్మసాధన జగత్సంస్కృతిశుద్ధి కోరువాడు, గాంధీ వర్గ రా లెంతో బలవంత పెట్టి బ్రతిమాలినను తనకు దేహస్వాస్థ్యము సన్నగిలినదని పార్లమెంటరీ కార్యభారము తక్క నితరము వలదని సాకులుచెప్పి తప్పించుకొనెను; అప్పు డామహనీయు డాపదవి కంగీకరించియుండిన నేటిదేశపరిస్థితులు మరొక విధముగానుండి తీరుననుట నిర్వివాదాంశము; కాని యాపుణ్యాధను డేలొకో ననేమిరా యనినేగాని తల యూప డయ్యెను.

అకారణమున కాంగ్రెసు ప్రముఖ సభ్యులలో జాల మందియాంధ్రనాయకుడును, దేశ సేవ కాగ్రగణ్యుడును, మేధావియునైన శ్రీభోగరాజు పట్టాభిసీతారామయ్యగా రధ్యక్ష పదవి కర్హుడని సూచనలు చేసిరి. కాని దేశదౌర్భాగ్యమున యల్పసంఖ్యాకులు కాంగ్రెసులో దీసిన చీలికలవలన గొందఱ

కాంగ్రెసునాయకునియం దసూయ కలిగి వంగదేశీయుడైన సుభాసుబోసు నెదిరిగా నిలబెట్టిరి. ఆయేటి యెన్నికలలో సుభాసుబోసు విజయమంది యధ్యక్షస్థాన మలంకరించెను. మహాత్ముడపుడు తెలుగునాయకుని యపజయము నాక ర్ణించి తానే యోడిపోయినని విస్తుపోయెను.

సుభాసుబోసు విజయ మందెనేకాని సరియైన కార్య దక్షత చూపలేక తన యధ్యక్షపదవికి రాజీనామా నిచ్చెను. మరల పలువురు నాయకులు అబ్దుల్ కలాంగారి నధ్యక్షత వహింప నడ్గించిరి కాని దేహారోగ్యము చెడుటచే నా నిగర్వ చూడామణి నిరాకరణను దెల్పెను. అపుడు బాబు రాజేంద్ర ప్రసాదు అధ్యక్షపీఠ మలంకరించెను. నాటినుండి ప్రకృతి చేతనే దేశము విషమస్థితిలో బడెను. కాంగ్రెసునకును లీగు నకును మైత్రి చేకూర్ప అజాదుగారు చేసిన విశ్వప్రయత్నము లీగునాయకుడైన జిన్నాగారి పట్టుదలవలన విఫల మయ్యెను. ప్రభుత్వమువా రీయదను తిలకించి, కేంద్రమున ఫెడరల్ రాజ్యాంగ మేర్పరుప యత్నించిరి. కాని దానికి ప్రభుత్వము వారి చేతిలో కీలుబొమ్మలైన కొందరు సంస్థానప్రభువులు స్వార్థపరులై వారంగీకరింపనైరి.

ఇంతలో ప్రపంచద్వితీయమహాయుద్ధము ప్రారంభ మైనది. అందు బ్రిటిషువారుకూడ నుండుటచే న్యాయమునకు తమయేలుబడిలోని రాజ్యమందలి ప్రజా ప్రతినిధు లందఱి తోను సంప్రతింపవలసియున్నది. నిరంకుశపరిపాలకులైన మన

ప్రభువులు మనయంగీకారము లేకనే మనలనుగూడ యుద్ధరంగమునకు లాగిరి. కొందరిదేమని ప్రశ్నింప మేము పోలండుస్వాతంత్ర్యము నిలబెట్టుటకు జర్మనీ నెదిరింపదలంచితిమి. ఇది లోకక్షేమంకరమగుట మీరు మాడాడకూడ దని ప్రత్యుత్తర మిచ్చిరి.

అందులకు కాంగ్రెసువారు అది మాకు సమ్మతమే కాని జాతిస్వాతంత్ర్యము మీరు హృదయపూర్వకముగ నీదలంచితిరా? నిరంకుశపాలనలో నున్న మాకు యుద్ధానంతరమయిన ముక్తి బడయ నుపాయము సూచింతురా? మేము కూడ శక్తివంచన లేక పాటుపడ యత్నింతు మనిరి. దానికి ప్రభుత్వ మేదో సాకు చెప్పి యనంగీకారమును వెలిబుచ్చుటయేగాక పోలిషుప్రజలకు దాము చేతు మన్నఘనకార్యమును జేయకపోవుటేగాక మీదుమిక్కిలి భారతీయులకుకూడ మొండిచెయ్యి చూపనారంభించి కేవలము యుద్ధప్రచారప్రయత్నములందే నిమగ్నులై తమ యిష్టము వచ్చినతీరున జేయ మొదలిడిరి. కాంగ్రెసువారు దానికి వ్యతిరేకభావము చూపదలంచి మంత్రిపదవుల నరనిమేషములో తృణీకరించి త్యజించిరి.

దేశము మఱింత యల్లకల్లోలమున బడెను. సామ్రాజ్యహింసాతత్త్వము చెలరేగి రాజకీయవాతావరణ మొక పెనుతుపానువలె భారతదేశమునుముట్టడించి భారతీయులనుమ్రింగివేయ దలంచునట్లు నాయకు లూహించి దానిని భేదింప శక్తివంతుడైన బుద్ధిమంతుని కాంగ్రెసునియంతగా చేయనుంకించి

శ్రీ మౌలానా అబ్దుల్ కలాంగారి నిష్పట్టునైన నధ్యక్షస్థానమలంకరింపక తప్పదని గాంధీప్రభృతులు పట్టుబట్ట శ్రీ అజాదుగారు మాఱుమాట చెప్పలేక యందుల కొడంబడిరి. దానికి ముఖ్యకారణములు కాంగ్రెసుయొక్క పదవీచ్యుతి, పునః జాతీయసమర వాంఛ లే.

ఇదివరలో రెండుమార్లు మాత్రమే ముస్లిమ్‌నాయకులు అధ్యక్షపీఠ నధిష్ఠించినారు. మొదట మౌలానా మహమ్మదాలియు, రెండవపర్యాయము డాక్టర్ అన్సారీ గారును, ఇపుడు అజాదును నిలబెట్టిరి. అది చూచి బెంగాలు నాయకులలో నొకరైన ఎం. ఎన్. రాయిగారు పోటీచేసిరి. అజాదుగారు కాంగ్రెసుపక్షీయుడు, రాయిగారు కరుడుగట్టిన విప్లవకారుడు. ఇద్దరును దేశమోక్ష మాశించువారే. అయితే అబ్దుల్ కలాంగారు అహింసావాది, రాయిగారు దీనికి ఎదురు చుక్క. అజాదుగారు నిర్మాణకార్యక్రమాభివృద్ధివలన దేశాభ్యుదయమును సంపాదించి స్వరాజ్యము బడయవలె ననెడి నీతికి ప్రాధాన్య మిచ్చు నాశయము గలవారు. రాయిగారు నిమ్నజాతులకును, పేదకార్మికులకును రాజకీయ తీవ్రత్వమును పుట్టించి, సమ్మెలు వగైరాలనుసాగించి ధనికత్వమును రూపుమాపి, వర్గసంఘర్షణముతో బ్రిటిషుపాలనము తొలగింపవలెననెడి యుద్రేకమునకు ప్రాముఖ్య మిచ్చువారు. కాంగ్రెస్‌వాది యయ్యు నిట్టిభేదము కలుగుటవలన నీ యెన్నికలలో అనగా 1940 సంవత్సరపు ఎన్నికలలో నజాదుగారే విజయమందిరి. రాయిగారికి 190 వోట్లువచ్చి అజాదుగారి కంత

కంటె పదిరెట్లు వోట్లు అనగా 1900 వోట్లు వచ్చినవి. ఇట్టి యఖండ విజయముతో అజాదుగారు కాంగ్రెసుకిరీటమును తలదాల్చిరి.

ఒక్క విషయ మిచట దూరాలోచనజేసి పరీక్షించి నిర్ణయించుకొనవలెను. రాయిగారుకూడ సామాన్యుడు కాడు. దీనివలన వర్గసమన్వయమునకును, గాంధీతత్వము నకును, అహింసాసిద్ధాంతమునకును గౌరవ మున్న దేశాని వర్గసంఘర్షణకు లేదని తేలినది. మఱియు నిందువలన హిందువులు ముస్లిములను ద్వేషింతురని ప్రభుత్వమువారు పుట్టించిన యపవాదు పూర్ణముగా నసత్యమని ఋజువైనది. జిన్నాగారు కొంతకాలం తల వంచుకొనిరి. రాయిగారు సాంఖ్యవాది యగుటచేతను, అజాదుగారు ఆస్తికవాది యగుటచేతను ప్రజలలో విజ్ఞానులైన వారేదో యనుకొనుటలో నాశ్చర్యమే మున్నది?

౮

## రామఘర్ కాంగ్రెసు

"పల్లెటూరున నుండు పసిపాపడైనను,
గాంధి పేరన్న చంకలను గొట్టు
మూలల గూర్చుండు ముసలమ్మ లందఱు
గాంధిచారిత్రల గడపు దినము

శుద్ధాంతవాసులౌ సుందరీమణులైన
గాంధిఫోటో చూడ గడగుచుండ్రు
సర్వసంగత్యాగసన్యాసులైనను
గాంధి మహావాక్యగణన జేతు
రౌరా! గాంధి మాహాత్మ్య మే మనగవచ్చు
పుడమి నా బాలవృద్ధుల ముఖములందు
నిలచియున్నవి తచ్ఛక్తిబలము లహహ!
తలచుచుండిరి ప్రత్యక్ష దైవమనుచు."

అనునట్లుగ గాంధీమహాత్మునిప్రఖ్యాతితో బాటు కాంగ్రెసు మహాసభయొక్క దివ్యనామముగూడ గ్రామసీమల కెగబ్రాకెను. దానికితగినట్లుగ మహానాయకులు భారతదేశమునకు గ్రామసీమలే ప్రాణాధారములని యెంచి కాబోలు 1885 లో నారంభింపబడి 1940 వఱకు నేటేట జరుగుచున్న కాంగ్రెసు మహాసభలలో గొన్నిటిని గ్రామసీమలందే జరిపినారు. అందు 1936 లో మహారాష్ట్ర దేశమండలి ఫైయిజపూరుగ్రామమందు జవ్హారుపండితుని యధ్యక్షతక్రింద జరిగిన దొకటియు, 1938, 1939 లలో వరుసగా గుజరాతు దేశమండలి హరిపురగ్రామమందును, మహాకోసలములోని త్రిపురిలోను సుభాసుబోసు అధ్యక్షతక్రింద జరుపబడినవి రెండును వెరశి మూడును గ్రామకాంగ్రెసుమహాసభలే. అవిగాక 1940 లో మౌలానా అజాదుగారి అధ్యక్షతక్రింద బీహారురాష్ట్రములోని రామఘర్ గ్రామమున జరుపబడినది నాల్గవది.

ఈ రామఘర్ బీహారురాష్ట్రమండలి హజారిబాగు జిల్లాలో చోటానాగపురసంస్థానములోని చిన్నగ్రామము.

ఇది 17 వ శతాబ్దమున మహోన్నతదశలో నున్న త్రియు పరిపాలమునం దుండెడి గొప్పదుర్గము. ఈ ప్రాంత ప్రదేశము లందు ఖనిజ సంపద బాహుళ్యముగ నున్నది. దీని కత్యంత సమీపముననే మన దేశములోని పారిశ్రామికులలో వగ్ర గణ్యులనందగు తాతాగారి లోహకర్మాగార మొకటి నిర్మింపబడినది. ఆ ప్రదేశమే నేడు 'జంషెడ్పూరు' అని పిలువబడుచున్నది. ఈ విశాల సామ్రాజ్య మందుగాని సూర్యుడ స్తమింపని బ్రిటిషుసామ్రాజ్యమందుగాని యిట్టి కర్మాగార మింకొకటి లేదు.

ఆ రామఘర్ కాంగ్రెసుమందిర నిర్మాణమును వర్ణించుట కాశేషుడే సమర్థుడగునో కాదో సంశయమే. ఆ మందిరమును దిలకించినవారికి మొగలుల యేలుబడిలో మహోన్నతదశ నందిన శిల్పకళాప్రౌఢిమ, లోకోత్తర పాలనమునను, అహింసావ్యాపకమునను దేవత్వమును కూడ త్యజించునంతటి త్యాగియైన యశోకుని కీర్తివల్లికల చిహ్నములను గురుతుచూపు శిల్పకళాప్రతిభయు కన్నులయెదుట దాండవించెను. (శ్రీ) మౌలానా అబ్దుల్ కలాంగా రాజాతీయ పీఠము నలంకరించెను. అపు డది సుధర్మపీఠముతో శివి మెఱయు నింద్రసభ ననుకరించుచుండెను. అదేమి శుభ సూచనమో, అశుభసూచనమో తెలియజాలము గాని నాటి సాయంకాలమున వరుణదేవుడు వర్ష రూపమున రామఘర్ గ్రామమున ప్రత్యక్ష మయ్యెను.

అజాదుపండితు డధ్యక్షపీఠమునుండి తనయుక్తియుక్త వాణితో నాటి దేశపరిస్థితులను సింహావలోకనము జేసి యుద్ధారంభమునుండి ప్రభుత్వమునకును, కాంగ్రెసునకును జరిగిన చర్చలనన్నింటిని క్రోడీకరించి భారతీయ ప్రజానీకము యొక్కయు కాంగ్రెసు మహాసభయొక్కయు ప్రధానాశయము సంపూర్ణ స్వరాజ్యమే యనియు దానికి ప్రధానముగ నాచరణీయములైనవి, నిర్మాణకార్యక్రమము, అహింసాయుద్ధము లేయనియు, సాంఘికకలహములవలన నష్టమే కాని లాభముండదనియు నే సంస్కృతికైనను జాతీయతయే యుత్తమ మార్గమనియు సహేతుకముగ నిరూపించుచు నుపన్యసించెను.

పిదప 'భారతీయుల పరమావధి సంపూర్ణస్వారాజ్యము, దానికి నిర్మాణకార్యక్రమము నింకను మిక్కిలిగ సాగించవలెననియు, అహింసాపద్ధతిని పోరాడి స్వాతంత్ర్యము నుసంపాదింపవలె' నను కొన్నియంశములతో నొక తీర్మానమును జేసిరి.

## ఉ ప సం హా ర ము

''పాంచాల దేశీయభక్తహంతకులైన
జెడుగు మూకలను శిక్షించుపఱకు
ఇస్లామ్ సహోదరాభీష్టానుగుణముగా
నిలఖిలాఫతు నిర్ణయించునఱకు
దేశీయగౌరవ దేశనాశకరమైన
ఘోరచట్టములన్ని మారువఱకు

జాతీయతాబహిష్కార సూత్రితములౌ
చిలిపిచేష్టలనన్ని చెండువఱకు
ఇవియు నవియని లెక్కింప నేల యిపుడు
ధన్యసంపూర్ణ నిర్నిరోధస్వరాజ్య
పీఠి కాసుప్రతిష్ఠ లభించువఱకు
తగునె నిద్రించుటది భరతపుత్రకులకు."

అని తన సోదర భారతీయ ప్రజానీకమునకు వేలాది యుపన్యాస వేదికలపై నెక్కి స్వాతంత్ర్య శంఖారావమూదిన నేటి భారత దేశనాయకాగ్రగణ్యుడగు గాంధీమహాత్ముని కనిష్ఠి కాంగుళిపై ఒకడుఅని లెక్కించి పిమ్మట రెండవవా రెవరా యని భారతీయుడు ప్రశ్నించుకొనినచో నా రెండవవ్రేలి మీదికి దూకువా రిరువురుమాత్రమే కలరు. అం దొకరు ప్రస్తుత కథానాయకుడైన అబ్దుల్ కలాం అజాదుగారు. వేరొకరు జవహరుపండితుడు. వీ రిరువురలో తారతమ్య మెంచ దలచితిమేని యే త్రాసు యెటువైపునను మొగ్గునో యెంతటి రాజకీయవేత్తయైనను వచింపజాల డనుట నిర్వివాదాంశము.

కాని పక్షపాత మొకించుకయు లేక జంకు గొంకు విడనాడి పరిశోధించితిమేని రెండును భారతీయవిజయపథమున గాంతిల్లు యశశ్చంద్రికాభాసురంబులైన రెండు రెక్కలుగ నెన్నవచ్చును. జవహరుపండితుడు మౌలనాఅజాద్ గారికంటె సునిశితబుద్ధి కలవాడయ్యు శాంతితత్వమున నొకించుక దూర

దృష్టి తక్కువవాడనవచ్చును. అజాద్ గారుజవ్హారుపండితుని కంటె మహావిద్వాంసుడయ్యును, రాజకీయవాతావరణమున కనుకూలమైన సమయస్ఫూర్తి కొఱతవడినవాడనంబడును. ఏది యెట్టులున్నను ప్రపంచము నేనాటికైన యీభారత పుత్రద్వయము మనసూర్యచంద్రులే నలువదికోట్ల భారతీయుల దాస్యశృంఖలములను విడగొట్టగలిగినవారని ఘంటాపథముగ వచించుట సత్యదూరము కానేరదు,

ఆజాద్ పండితుని ప్రకృతితత్వము సర్వదా యాధ్యాత్మికపురుషునివేగమునపడి దొర్లుచు భారతీయసోదరులను నాకాతతి నప్రమాదకరముగ తీరముంజేర్చు భావపరంపరల నూగులాడుచుండును. ఆమేధావంతుడు షష్టిపూర్తివయసు వాడయ్యు ముఖమందు తాండవించు చిఱునవ్వుతోగూడిన తేజఃపుంజ మూర్తినిని యువకుడనియే భ్రమింపజేయును. సహజముగ దృఢశరీరుడును, ఆరోగ్యవంతుడునైన అబ్దుల్ కలాం అజాదు నిరంతరవిద్యావ్యాసంగపుటలవాటునను, కార్యదీక్షాభారధురంధరత్వమునను, పలుమారులు కారాగారవాసుడై బాధనొందినవాడునగుట ననారోగ్యమున కిటీవల పాల్పడెను.

ఈత్యాగధనుడు కారాగారమున మ్రగ్గుచుండగనే సతీవియోగము సంభవించెను. అయినను దొరతనము నాధీటడించుకొనియు తనవిడుదలవిషయమున గోరలేదు. అన్యులు యత్నించినను వారించెను. సర్వమాన్యతయందును త్రిక

రణములచే జీర్ణించుకొన్న యహింసాతత్త్వరతియుండును పర శ్రేయస్సహనమును త్రికాలములయందు సంపదించును. అయనకు జాతీయత యన్న ప్రాణముని ముస్లింలోక సంబంధము నెఱుంగును. హైందవము తెలుంగునని చెప్ప నవసరము లేదు. మహాసభలలో నాత్మకథను నుపన్యసించుచున్నపుడా మహాపండితుని భాషాశైలి, భావగుంభన, పదలాలిత్యము, కార్యకారణసమన్వయము, ఊహాశక్తి, చూచియే తీరవలెను.

1940 లో మౌలానా అజాదుగారు రెండవపర్యాయము కాంగ్రెసునకు అధ్యక్షత వహించినప్పుడొసంగిన యుపన్యాసములోని సారమంతయు మంచి చమత్కారములుగాని యందలి కొన్ని యుపదేశ గుచ్ఛములు నిందు పొందుపఱచుచున్నాము.

ఆ జాతీయ ప్రతిభాజీవనుడు మొదట తన్ను రెండవ పర్యాయ మధ్యక్షుడుగా నెన్నుకొనినందులకు కృతజ్ఞత వెల్లడించినాడు. తరువాత నాటికి లోబడ జరిగిన రాజకీయ సాంఘికపరిస్థితులను విపులీకరించినాడు. సామ్రాజ్యవాదుల తత్త్వమును నిరసించినాడు. రాజ్యాంగ చట్టముల పౌర్వాపౌర్యములను స్పష్టీకరించినాడు. నాజీ ఫాసిస్టు పక్షములను దుమ్మెత్తిపోసినాడు. డొమినియనులను గూర్చి ముచ్చటించినాడు. బ్రిటిషు రాజనీతినిగూర్చి ఘాటుగ మాటలాడినాడు. కాంగ్రెసువారికిని

బ్రిటీషువారికిని జరిగిన ఉత్తరప్రత్యుత్తరముల నేకరువు పెట్టి నాడు. జాతీయవాదులైన వారందరిలో నాయన దూరదృష్టి కలవాడై యుద్ధనిర్వహణ ప్రయత్నములందు ప్రభుత్వము వారి కెట్లుగా దోడుపడగూడదో సహేతుకముగ జర్చించి నాడు.

సామ్రాజ్యతత్వము న్యాయవిరుద్ధమని సింహగర్జనల జేసినాడు. సాంఘిక సమస్యను దుమ్మెత్తి పోసినాడు, కాని మన జాతీయాదర్శమును జేరుటకుముందు సాంఘిక సమస్యా పరిష్కారమవశ్యమని దానికి రెండుసూత్రములను నిర్ణయించి నాడు. అందు 1. భారతదేశంలో నెట్టిరాజ్యాంగము వచ్చి నను దానిలో నల్పసంఘము లన్నింటిహక్కులు జాగరూక తతో రక్షింప హామీ నిచ్చినాడు. వానికెట్టి రక్షణ వల యునో యాసంఘములే నిర్ణయింతురు అని తీర్మానించినాడు. ముస్లిములు మొదటినుండియు చేసిన పొరపాటులను వివరించి చెప్పి సవరించుకొనుమన్నాడు.

విశేషించి మీబోటిమహాపండితులకు, వక్తలకు, రాజ కీయవేత్తలకు, మనీషావంతులకు నేను చెప్పెడి దంతగాలేదు. భారతజాతికంతకు ఏకైక నాయకుడైన మహాత్ముని యా దేశానుసారము ఐకమత్యము, క్రమశిక్షణ, మననాయ కాగ్రణియందు విశ్వాసము నుంచి మనము ఏకదీక్షతో పనిజేసితిమేని జయ మందలము. ఇందావంతయు సందియము లేదు.

అని రామఘుర్ దేశీయ మహాజనసభాధ్యక్షత పీఠినుండి యీ పుణ్యశీలుడు పలికిన పలుకులలో నించుకేనియు నసత్యము లేదు. నాటి మహోపన్యాసాంశములను వినినవారెల్ల నాశీల వంతుని వేనోళ్ళ పొగడిరి.

భారత దేశ మండలి నాయకు లందరిలోను గూఁడ అజాద్ పండితుడు ప్రకృతిచేతనే యహింసాభావములు కలుగఁబట్టిన యాధ్యాత్మిక వేత్త. ఈయన సర్వమాన్యుఁడు. నిరాడంబర జీవి. సత్యశౌచంబులను మతధర్మంబుల పగిది పరిగణించువాఁడు. ఆయన జీవితములోని గొప్పవిశేష మేమనఁగా ధార్మిక సేవకు జాతీయ సేవకు సమన్వయము కుదుర్చుట. తన పత్రికల మూలమునను, ఉపన్యాసముల వలనను, స్వయముగా యువకులకు బోధించు పద్ధతితోను ముస్లిమ్ దేశములన్నిటియందును, జాతీయోత్సాహమును పెంపొందించినాఁడు. సారస్వత క్షేత్రమున నెన్నింటినో యపూర్వబీజములను నాటినాడు.

హిందూస్థానీ వాఙ్మయమున పటుభావాన్వితమైన శైలిలో విప్లవరచన గావించి లేఖకులకు ఆదర్శమును చూపినాడు. భౌతికాధ్యాత్మిక సంబంధమైన రచనా చాతుర్యమున నందెవేసిన చేయి. మతధర్మములను సూత్రీకరించి ప్రబలధీశక్తినుపయోగించి శత్రువునైన తన పిడికిలిలో సౌమ్యభావమున పట్టఁగల ప్రజ్ఞాశాలి. మహమ్మదీయ మతగ్రంథములలో తలమానిక మనందగు ఖురానునకు లోకోత్తరమైన మహా

భాష్యమును వ్రాసి తన్మతకర్తల యౌన్నతిని నిలబెట్టినాడు. మస్లింజాతికంతకును మతవాక్యార్థనిర్ణయమును గావించినాడు అంతయేల? ఆ త్యాగధనుడు తన జాతీయోద్యమాయుధముచే ప్రభుత్వమును కసిగండ జేసినాడు. ఆ ధన్యజీవుడు భారతమాత కొక గారాబుబిడ్డ. ఆమె సర్వదా తన బిడ్డ నాశాస్నేహాయనుచు భావికి గొంపోవుచున్నది.

భారతమాతా! నీ కన్నీరు తుడిచి నీనొక్కదార్ఢ్య

డిటో

ఘోషించి యువవయస్సునుండి నీ కపార

...గోస్వామాచారి

సేవను జేయుచు నీదాస్యశృంఖలములను విడగొట్ట విశ్వప్రయత్న మొనరించు నీ యనుంగుబిడ్డ నేమని దీవింతువో! ఆతడు మహాత్యాగియు, ధార్మికుడనియు నీ పుత్రులందఱు పొగడుచున్నారు. ఆధ్యాత్మిక మోక్షమును రాజకీయ మోక్షమునుగూడ జనులందఱకు గలుగజేయ బద్ధకంకణుడై తన జీవితసర్వస్వమును నీ పాదారవిందముల కర్పించిన నీ సుపుత్రు నొక్కమారు శిరంబు మూర్కొని కపోలములను స్పృశించి బుజముతట్టి హస్తమస్తక సంయోగము జేసి నీ కోరికె సఫలమగుగాత యని యాశీఃపుష్పరాశి విరజిమ్ముము—నీ యాశీర్వాదబలమున నీ పుత్రరత్నము భారత జాతి కంతకును ఆదర్శ పూరుషుండై ఖండ ఖండాంతరముల తన యశశ్చంద్రికల నింపగలడని నీ హృదయఫలకమున ప్రతిబింబించుటలేదా? ఆతని కీ పృథ్వియం దొక్క నీ పాద

సేవ తక్క యితరవ్యామోహములు లేవు. నీ యాశీః ఫలితము వలన నచిరకాలములో ప్రభుత్వ నిర్బాధ వారాశి నుత్తరింప గలడనుటకు సందియ మా వంతయు లేదు. తల్లీ ! నీవు కృతజ్ఞత చూపుము—

మౌలానా అబ్దుల్ కలాం అజాద్ హిందూముస్లిము సోదరుల కందఱకును వందనీయుడు—పూజనీయుడు-ప్రశంస నీయుడు.

"భరతమాతగర్భమునందు భవ్య [illegible] సేవకు
జననమందిన నజాద్ ధన్యచరిత మేగ
పఠియింతు రవ్వారు ప్రాజ్ఞులాదు
రనుచు జాటుదు నిశ్శంక నవనియందు.

సంపూర్ణము.



## నాయకుల జీవితములు

| | | |
|---|---|---|
| మహాత్మా గాంధి | 0 | 8 |
| జవహర్‌లాల్ నెహ్రూ | 0 | 8 |
| హిట్లర్ దురంతములు | 0 | 8 |
| సుభాసుచంద్రబోస్ | 0 | 8 |
| చిత్తరంజన్ దాసు | 0 | 8 |
| బాబూ రాజేంద్రప్రసాద్ | 0 | 8 |
| అచ్యుతపట్వర్ధన్ | 0 | 8 |
| జాతీయనాయకులు 1 వ భాగము | 1 | 0 |
| డిటో 2 వ భాగము | 1 | 0 |
| రాజగోపాలాచారి | 0 | 8 |
| జైహింద్ (చక్రవర్తి పద్యములు) | 0 | 4 |
| మదనమోహన మాలవ్య | 0 | 8 |
| రవీంద్రనాథ టాగూర్ | 0 | 8 |
| అబుల్‌కలామ్ అజాద్ | 0 | 8 |
| జనాబ్ జిన్నా | 0 | 8 |
| నెహ్రూ ఇందిరకు వ్రాసిన లేఖలు | 1 | 0 |
| కస్తూరిబా గాంధీ | 0 | 8 |
| అజాద్ హింద్ ఫౌజ్ | 1 | 0 |
| జైహింద్ (వచనం) | 0 | 8 |
| స్వామి వివేకానంద | 0 | 12 |
| ఆచార్య కృపలానీ | 0 | 8 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.